# తేజస్సు నా తపస్సు



★

కవితాసంపుటి

★

డా॥ సి. నారాయణరెడ్డి

# మా పరిచయం

మాది కొత్త ప్రచురణ సంస్థ. శ్రీభారతి.

సర్వాంగ సుందరంగా, సరసహృద్యంగా, అభిజన సమ్మతంగా పుస్తకాలు తీసుకొని రావాలని మా సంకల్పం. సాహిత్యం, జీవిత చరిత్ర, ప్రాతిపదిక విజ్ఞానం, ఆధునిక నిఘంటువులుకూడా వెలువరించాలని మా అభిలాష. అయితే విజ్ఞులైన రచయితల, వివేచనాశీలురైన పాఠకుల సహకారం మాకెంతో అవసరం.

డా॥ నారాయణరెడ్డిగారు నవ్యకవులలో సుప్రసిద్ధులు. ఇదివరకే ఎన్నో కావ్యాలను వెలువరించి రసజ్ఞలోకానికి సుపరిచితులైనారు. ఇటీవలే వీరిని మీరట్ యూనివర్సిటీ (యు. పి.) గౌరవడాక్టరేట్ బిరుదుతోసత్కరించింది.

ఈ కావ్యం విలక్షణమైనది. వర్తమాన సామాజిక పరిస్థితులన్నిటినీ నవరసభరితంగా వ్యాఖ్యానం చేస్తున్నవి ఈ ఖండికలు.

''ఇక్కడ నాయాగం
నవ్వుతూ తుళ్ళుతూ
నడినెత్తిలో కావ్యాగ్నులల్లుతూ,'' తపస్సు చేస్తున్నారు కవి.

''సమత నాతల్లి
సౌహార్దం నాతండ్రి
అనాది నాజననం
అనంతం నా పయనం'' అని సుకవితా ప్రవృత్తిని చక్కగా వ్యక్తం చేస్తున్నారు. ''ఆగామి సమాజంలో సరికొత్త తీగగా మోగుతూ, తిరుగులేని వెలుగు వాగుగాసాగు'' తాననే కవితాత్మ, హృదయ స్పర్శి కదా ?

ఈ కావ్యం పేరు ''తేజస్సు నా తపస్సు.'' వెలుగు మీ ముందుంది. అందులో మీ హృదయాలు ప్రతిఫలిస్తే ఈ ప్రచురణ కృతార్థం.

మా శ్రీభారతీ సంస్థకు ఇది తొలిసోపానం.

మీ
కృష్ణమూర్తి.

# నమస్తే —

కవికీ ఋషికీ యుగాదిగా ఉన్న అభేదం మీకు తెలిసిందే.

కవిత్వం తపస్సులాంటిదనే అభిప్రాయం ఎంతగా మాగిపోయిందో మీకు గుర్తే.

కవిగా నాదీ ఒక తపస్సే. కానీ దాని ఆకృతి వేరు; ఆత్మ వేరు. మొదటి కవిత చదవండి మీకే తెలుస్తుంది.

భావచిత్రాల దొంతరలు పేర్చి ఇదీ కవిత్వమంటే అని ప్రశాసించే తరహా నాదికాదు.

ప్రతి కవితలో ఒక జ్వలిత చేతన ఉండాలి. అది పాఠకునిలో ఒక కల్లోలం కలిగించాలి. ఆ కల్లోలం సమాజంలోని విషమగతులకు ప్రతిద్వంద్విగా ఉండాలి; ప్రగతిశక్తులకు బాసటగా రూపొందాలి.

ఈ దృక్పథంతో అవతరించిన నా కవితలు కొన్ని పొడిపొడిగా సాగి కొనమెరుపు విసురుతో ముగుస్తాయి. 'గుప్పిట్లో నిప్పులతో' లాంటివి అలాంటివే.

పాఠక మహాశయులు నా కవితలను ఈ దృష్టితో పరిశీలించాలని మనవి

ఇవి 1975 లో వ్రాసిన కవితలు. కొన్ని పత్రికల్లో వెలువడినవి. కొన్ని తొలిసారిగా వెలువరిస్తున్నవి.

ఈ సంపుటిని ఇంత అందంగా ప్రచురిస్తున్న శ్రీ భారతీ సంస్థకు కృతజ్ఞుణ్ణి. గ్రంథ విక్రయరంగంలో బహుళానుభవం ఉన్న మిత్రులు శ్రీ కృష్ణమూర్తిగారి వినూతన ప్రచురణసంస్థకు ఈ సంపుటి ప్రథమశ్రుతి కావడం సంతోషంగా ఉంది.

ఈ పుస్తకానికి భావబంధురమైన ముఖచిత్రాన్ని వేసిన శ్రీ శ్రీవత్సగారికి ప్రత్యేకాభినందనలు.

సెలవు.

మీవాడు,

నారాయణరెడ్డి.

# క్రమణిక



——

# తేజస్సు నా తపస్సు

ఇది నైమిశారణ్యం కాదు.
మంచులా ఘనీభవించిన
మారు మూల శూన్యం కాదు.
జడలా బిగుసుకున్న ఏకాంతం కాదు
మౌనంలా పరచుకున్న అనంతం కాదు.
ఇది బజారు
ఉదధిలా అరిచే హోరు.
ఇది ఇల్లు
ఎక్కుపెట్టిన కనుబొమ్మ విల్లు.

ఇక్కడ నేను
నిలుస్తూ నడుస్తూ
నిలువెత్తు మంటల్లో తడుస్తూ.
ఇక్కడ నా యాగం
నవ్వుతూ తుళ్లుతూ
నడినెత్తిలో కావ్యాగ్నులల్లుతూ.
ఇక్కడి దృక్కు
ముక్కుకొన మీద కాదు
దిక్కు మొన మీద.
ఇక్కడి లక్ష్యం
స్వీయ శ్రేయం కాదు - జగ
దీయ ప్రేయం.

## 2

ముడుచుకోదు ఈ కన్ను
పడమర్లలా
మూసుకోదు ఈ నాసిక
ముకుళంలా
మొండివడదు ఈ చేయి రాయిలా
మూర్ఛపోదు ఈ చెవి మోడులా
ఎండిపోదు ఈ నాలుక
ఎడారిలా.
ఇక్కడి పంచేంద్రియాలు
ఎప్పుడూ రగిలే ఇంధనాలు.
ఎక్కడో ఒక చెమట చుక్కలో
ఇనబింబం ప్రజ్వలిస్తే
ఈ కంటికి అరుణోదయం.
ఎక్కడో ఒక వల్లకాటిలో
మల్లెతోట పల్లవిస్తే
ఈ నాసిక విద్యుల్లాసిక.
ఎక్కడో సహారా ఒడిలో
శ్రావణమేఘం వర్షిస్తే
ఈ తనువు మహేంద్ర ధనువు.
ఎక్కడో కడలి బడిలో
విసీల రాగం వినిపిస్తే
ఈ శ్రవణం ఆనందభువనం.
ఎక్కడో ఏ నిరుపేద డొక్కలోనో
గంజిలాంటి అమృతం పడితే
ఈ నాలుక కైవల్య వేదిక.

రక్కసులు హుంకరించే ఊళ్లో
రక్త బిందువుల్లాంటి శిశువులు
ఒకే గొంతుతో సామ్యవేదాన్ని
ఉద్ఘోషిస్తే
మృత్యువు వికటించే మరు భూమిలో
నిత్య తరుణ సమీర మాలికలు
పచ్చ పచ్చగా సౌమ్య జీవనాన్ని
ప్రసరిస్తే
ప్రతి సరిత్తులో అభినవ చేతనా
నితాంత విద్యుత్తులు ఉదయిస్తే
ప్రతి శరత్తులో అమ్లాన పూర్ణిమా
శతదళ గరుత్తులు వికసిస్తే
గళ ఘంటిక అనుక్షణం మోగితే
జగన్మంగళ గీతిక అహర్నిశం సాగితే
శవాల దిబ్బలో దిగిన కర్రు
సజీవ సంస్కృతిని పండిస్తే
ఉక్కు కోటలో ఎత్తిన సుత్తె
ఉన్ముక్త నాగరికతను పలికిస్తే
అదే నా తేజస్సుకు తొలిమెట్టు
అదే నా తపస్సుకు తుదిగట్టు.

మథిత హృదయంతో
పృథివి నిశ్వసిస్తే
ఉదయిస్తుంది ఒక గంధం.
జాగృతాత్మతో

జలం చౌకళిస్తే
చవు లొలుకుతుంది ఒక రసం.
ప్రచలితాంగుళులతో
పవన వీచిక స్పృశిస్తే
తనూ సంపుటికి తాదాత్మ్యం.
గర్జితాంతరాళంతో
గగన కాహళ ధ్వనిస్తే
జగజ్జలధిలో స్వర తరంగం.
ఓజో నిబిడో ద్వేగంతో
తేజోవలయం చంక్రమిస్తే
త్రికాలాలకే రూపకరణం.
సృష్టికే తొలకరి ఆ రూపం
దృష్టికే ఊపిరి ఆ రూపం
ఆ రూపమే నా తపస్సులో
రూపు దిద్దుకునే స్వరూపం.

నేను చేస్తున్నది
ఏ దుర్జయ పర్జన్యుని
ఇనపగుప్పిట్లోనో కట్టువడ్డ
తొలకరి మొర వినిపించే
దుర్దాంత తపస్సు.
నేను సాగిస్తున్నది
ఏ నియంత రక్కొస చట్టాల
ఇరుల కట్టడిలోనో మూల్గుతున్న
ఊపిరి చెర విడిపించే
ఉద్దామ తపస్సు.

5

నేను బోధిస్తున్నది
వ్యాకర్తలు బిగించిన సూత్రాల
వ్యాళ బంధాల్లో నలుగుతున్న
అనుభూతులను ఆవిష్కరించే
అక్షర తపస్సు.
నేను వాదిస్తున్నది
గతభర్తలు తమ చుట్టూ కట్టుకున్న
ఘనీభూత సంప్రదాయాలను
పెళ్లలు పెళ్లలుగా పడగొట్టే
కల్లోల తపస్సు.
నేను సాధిస్తున్నది
వర్తమాన మూర్తుల శిరస్సుల్లో
వర్తులంగా పరిభ్రమిస్తున్న ఆర్తిని
ఊర్ధ్వ ముఖంగా నిలబెట్టే
ఉత్తాల తపస్సు.
ఈ తపస్సు నిష్పరిధి
ఈ తపస్సు నిరుపాధి.
ప్రగతికీ – జడ జంగమ
ప్రకృతికీ – ఇది ఆది.

మరణాన్ని వరించిన మోళ్లలో
తరుణ పల్లవావతరణం తపస్సు.
కెంజిగుళ్ల బంగరు ముంగిళ్లలో
కిశోర కుసుమోదయం తపస్సు.
ప్రసూనాలు రాలిపోతూ ఫలాల
పాపలను అందించడం తపస్సు.

## 6

ఆ పాపలే పరిణత రస
రూపాలై స్పందించడం తపస్సు.
ధరాగోళం తన చుట్టూ
తానే తిరగడం తపస్సు.
అర్క మండలం కర్మ సాక్షిలా
అన్వీక్షించడం తపస్సు.
చెలియలి కట్టను చుంబించడం
జలరాశి చేసే తపస్సు.
కాలాన్ని తనలో బింబించడం
గ్రహరాజి చేసే తపస్సు
నింగిలో సూర్యేందువులు
నేలపై సప్త సింధువులు
భూగర్భాన్ని విదళించే మహీధరాలు
ద్యోవలయంలో విహరించే పయోధరాలు
ఒంటిలో రుధిర తంత్రికలు
కంటిలో దృశా దీపికలు
చేస్తున్నది తపస్సే.
నిస్తులంగా నిఖిలంగా
ప్రసరిస్తున్నది తపస్సే.

ఎండను విరిదండగా మార్చుకొని
వెన్నెలను వజ్రం వెన్నుగా తీర్చుకొని
చలిని నులిమంటగా కూర్చుకొని
శిశిరాన్ని రేపటి వసంతానికి
జేగంటగా సమకూర్చుకొని
నాలోని నాద ప్రకృతి

7

నవంనవంగా చేస్తున్నది
జ్వాలా తపస్సు.
ప్రేలుస్తున్నది
వేలాతీత కవితా
హేలా హవిస్సు.
ఈ తపస్సు కొనసాగనీ
కౌటిల్యం కరిగేదాకా
జాటిల్యం చెరిగేదాకా
కర్మ జీవిలో నవవిప్లవ
కైవల్యం వెలిగేదాకా.
ఈ తపస్సు కొనసాగనీ
ధనస్వామ్యం విరిగేదాకా
జనస్వామ్యం పెరిగేదాకా
పణవిపణి లాంటి లోకంలో
ప్రగతి మూల్యం ఎదిగేదాకా.

——

# రెక్కల మేడ

సముద్రం మధ్య ద్వీపం
ఆకాశం మధ్య చంద్రబింబంలా.
ద్వీపం మధ్య గుడిసెలు
తెగిన వెన్నెల తీగల్లా.
గుడిసెల మధ్య మేడ
చంద్రుడిలోని కళంకంలా.
గుడిసెల కేమి-లేని హాయి;
గుండెమీద చెయ్యేసుకుని
గురక పెడతాయి.
ఉన్న దిగులంతా మేడకే
ఉప్పెన ఎప్పుడొస్తుందో !
పునాదులనే పుక్కిలిస్తుందో !

ఒంటి స్తంభం మేడకు
ఒళ్లంతా బుద్ధులే.
ఉప్పెనంటూ వస్తే
ఉపద్రవం ముంచుకొస్తే
ఏమిటీ ఉపాయం ?
రెక్కలే తనకుంటే
చుక్కల్లోకి ఎగరొచ్చు ;
అక్కడ అనపాయం.

## 9

మేడ నిలబడింది
మాడు గోక్కుంది
బుర్ర పదునెక్కింది
వెర్రి తలకెక్కింది.
గుడిసెల కప్పులు ఊడదీసి
మనుషుల నెత్తురు జిగురు చేసి
రెక్కలుగా అతికించుకుంది
దిక్కులు కప్పుకుని పడుకుంది.

అర్ధరాత్రం ఫాలనేత్రం
అమాంతంగా విచ్చుకుంది.
నిప్పులా కదలి గుండెలో
ఉప్పెన రగులుకుంది.
ఉలిక్కిపడ్డది మేడ
చురుక్కున తడి తగిలి.
చుక్కలంటాలనుకున్నది
రెక్కలతో ఎగిరెగిరి.

"హుం హుం —— హాయ్ హాయ్"
పొంగుతున్నాయి కండలు
కుంగుతున్నాయి పునాదులు.
"ఆహ్ ఆహ్ - ఓహ్ ఓహ్"
ఆక్రందిస్తున్నది మేడ
ఆక్రమిస్తున్నది ఉప్పెన.
తెగిపోతున్నై రెక్కలు
తిరగబడే నిప్పురవ్వల్లా.

## 10

పడిపోతున్నై గోడలు
పగుళ్లు వారిన ఊహల్లా.

తెగిపోయిన రెక్కలేమో
కుదుట పడ్డాయి గుడిసెలుగా.
జిగురైన నెత్తురేమో
జీవించింది మనుషులుగా.

---

# ఎవరు నువ్వు

ఎంత లేతగా ఉన్నావు
విరిలా.
ఎంత పాతగా ఉన్నావు
గిరిలా.
రూపులో మార్దవం
చూపులో ఆర్జవం
ఎవరు నువ్వు ?

అరెరే—
అవి పిడుగులు ;
వడగళ్లలా గుప్పిట్లో
పట్టుకుంటున్నావు.
అవి పడగలు ;
గొడుగుల్లా తలపైకి
ఎత్తుకుంటున్నావు.
అయ్యయ్యో !
పడ్డది గొడ్డలి వ్రేటు.
చిత్రంగా వుందే !
నరకబడ్డ నీ ఒంటిలో
కిరణాలు లేస్తున్నాయి.
ముక్కలైన నీ గుండెలో
మొదుగులు పూస్తున్నాయి

తునాతునకలైన నరాల్లో
దుందుభులు మోగుతున్నాయి.
పొడిపొడైన కీళ్లలో
పిడికిళ్లు మొలుస్తున్నాయి.

ఆగాగు—
అది అగ్ని స్రవంతి.
ఈదుతున్నావే
జ్వాలా హస్తాలతో
చూస్తున్నావే
స్ఫులింగ నేత్రాలతో.
ఎవరు నువ్వు ?
నువ్వెవరు ?

''సమత నా తల్లి
సౌహార్దం నా తండ్రి
అనాది నా జననం
అనంతం నా పయనం
విశ్వం నా ఊరు
శాంతి నా పేరు."

—

# సమాధులు

సమాధులు ఎగిసిపోతున్నాయి
పావురాల్లా
పరమ హంసల్లా.

సమాధులు లేచిపోతున్నాయి
పతివ్రతల్లా.
పావన చరితల్లా.

సమాధులు నడిచిపోతున్నాయి
యువతరంలా
నవశకంలా.

*

విచ్చెక్కిన మతాల తొక్కిడిలో
పీకలు తెగిన రహమాన్లనూ రామయ్యలనూ
కామాంధుల పడగల గుప్పిటిలో
కమిలి పోయిన సీతలనూ సుజాతలనూ
నరహంతల మారణార్భటిలో
విరిగిపడ్డ పిడికిళ్లనూ పడుచువాళ్లనూ
మోసిన సమాధులు
గుండెల్లో శిశువుల్లా
దాచిన క్షమానిధులు ;
ధరిత్రిని చీల్చుకుని

శిరస్సులను చిమ్ముకుని
ఎగిసి
లేచి
నడిచిపోతున్నాయి.
సుడిగాలిలా ఎడాపెడా
చరిచి పోతున్నాయి.

సమాధులకు కలిగిన సంచలనం
సజీవ చైతన్య ప్రజ్వలనం.

——

# తిరిగొచ్చిన పాటలు

ఇవి నా పాటలు
ప్రబంధాల పంజరాలను
వ్యాకరణాల ఇనప్పెట్టెలను
ఏకంగా తప్పించుకుని
ఎగిసి వచ్చిన ఎర్ర ముత్యాలు.
పల్లెపిల్ల ముక్కుపోగు కోసం
పలవరించే వెర్రి సత్యాలు.

వీటిని కాజేయాలని
పోటీ పడ్డారు
లయలేని వాళ్లు
ఒళ్లంతా గాలించినా రవ్వంత
దయలేని వాళ్లు
కండలను ముద్దబంతులుగా
కలేజాలను గులాబీ గుత్తులుగా
అమ్ముకునే వాళ్లు
హృదయాలను పాచికలుగా
ఆడుకునే వాళ్లు.

విధిలేక పంజరాల్లో
గతి లేక ఇనప్పెట్టెల్లో
చిక్కుకున్న నా పాటలు ;
కమ్ముకున్న కటకటాల్లో

కప్పుకున్న కటిక గోడల్లో
మూల్గుతున్న తొలిపొద్దు బాటలు ;
కట్లను తెంచుకుని
చీకట్లను చీల్చుకుని
నిజంలా వికసించే నింగిలో ఎగిసి
జాలిలా ద్రవించే గాలిలో కలిసి
చేరుకున్నాయి చివరికి
పూరింటికి.
ఆవురంటూ ఎదురు చూస్తున్న
కలం కంటికి.

---

# సూర్యుడు

ఏడీ ?
ఏమైనట్టు ?
గుహలా గది
చీకటిలా మూలుగు
నిశ్శబ్దాన్ని పశువులా
నెమరేసే మృత్యువు.

ఏదీ ?
ఏం జరిగినట్టు ?
నొసటికి బురద
నోటికి తాళం
కాళ్లకు కత్తెర
కళ్లకు సంకెల.

ఏమిటి ?
ఎవరా వస్తున్నది ?
పొంగే నెత్తురు ముద్ద
పూచే అగ్ని పిండం
పొడిచే పరివర్తనం
నడిచే నవచైతన్యం.

## 18

ఏమిటది ?
ఎవరది ?
నిన్న మరుగుపడినవాడు
నేడు తిరగబడినవాడు.

---

# గాలిని బంధిస్తే

"ఎవడురా అక్కడ ?
ఎక్కడిదీ వాసన ?"
రాజుగారి ముక్కుమీద
రాజుకున్న సీత్కారం.

"వానకు తడిసిన మట్టినుంచి
వస్తున్న వాసన మహారాజా !"
సేవకుల నత్తి మాటల్లో
జావగారుతున్న వినయం.

"ఆపండిరా వాసనల్ని
అరికట్టండిరా మట్టిని."
ప్రభువుగారి గొంతుకలో
పడగెత్తిన హుంకారం.

"వాసనల్ని విసురుతున్నది
మట్టికాదు గాలి ప్రభూ !"
ఆశ్రితులెత్తిన చేతుల్లో
అంటుకు పోయిన దీనత్వం.

"అయితే చుట్టు ముట్టండి
ఆ గాలినే నొక్కిపట్టండి"
నియంత ఉక్కు చట్టంలో
నిప్పులు కక్కే అహంకారం.

హడావిడి అలజడి
తొక్కిడి తోపిడి
టోపీలు లాఠీలు
అరుపులు చరుపులు.

"పట్టుకున్నాం - గాలిని
పట్టుకున్నాం
నెట్టుతున్నాం - చెరలో
నెట్టుతున్నాం".

ఉరుములా నవ్వే రాజు
చరుచుకున్నాడు రొమ్ము.
అదే ఆఖరి కహకహ ధ్వని ;
ఆగిపోయింది దమ్ము.

"గాలి లేనిదే ఊపిరి లేదు
ప్రజ లేనిదే ప్రభుతలేదు"
గగనం పలికింది పొడిగా
చినుకుల్లో తడిసిన మట్టిలా తడిగా.

——

# తలుపు తడుతున్న దెవరు?

ఎవరు ? ఎవరు ?
తలుపు తడుతున్న దెవరు ?
పాలవాడా ! పూలవాడా !
మేకగడ్డం కాబూలీవాడా !
పేపర్ వాడా ! పెళ్లి
చూపుల వాడా !
ప్రేమలాంటి ఊబిలో పడ్డ
పిచ్చివాడా !
కొత్తగా కవిత్వం రాసేస్తున్న
చిరంజీవి ఉదయార్కుడా ?
మార్కుల వేటలో పడ్డ
మహారాజశ్రీ అక్రమార్కుడా ?
తప్పిపోయిన బావమరిదా ?
గుప్పుమనే బీబీ జరదా ?
ఎవరు ? ఎవరు ?
తలుపు తడుతున్న దెవరు ?

*

తెలిసిపోయింది
తలుపు తట్టిన పిడికిలేదో
తెలిసిపోయింది.
మన్నించండి మన్నించండి
మరిచిపోయాను

అన్నమాట మరిచిపోయాను.
రాత్రి ఒంటి గంటకి
అన్నీ తెంచుకుని వస్తానని
అన్నమాట మరిచిపోయాను.
వస్తున్నాను ; ఇదిగో
వస్తున్నాను
సుప్తిలాంటి
శూన్యంలోకి కాదు
దీప్తిలాంటి చై
తన్యం లోకి.
బోధిసత్వునిలా కాదు
క్రోధనిత్యునిలా.

——

# గుప్పిట్లో నిప్పులతో

అందరూ వెళుతున్నారు
ప్రవాహంలా
ప్రభంజనంలా

ఎందరో ఉరుకుతున్నారు
హరిణాలలా
కిరణాలలా

ముడుపులు చెల్లించడానికి
పిడికిళ్లనిండా పూలతో.

ఒక్కణ్నే ఉండిపోయాను
నిశ్శబ్దంలా
నిశీధంలా.

బిక్కుమంటూ దిక్కులు చూశాను
ఆవిరిలా
కావిరిలా.

అప్పుడు నేనూ అడుగేశాను
గుప్పిట్లో మండే నిప్పులతో.

——

# క్షమించాలి తల్లీ

"నీ వీణకు నూరు తీగలు
నేనూ చేరుతా నూటా ఒక తీగనై.
నాకు తెలుసు నువ్వు మీటుతావని
అప్పుడు మోగుతా కొండవాగునై."

అన్ని తీగల నాదం
"అంతా అంతా కుశలం"
నేను పలికే నినాదం
"ఉన్నదంతా వికలం."
అదుగో నీ ఒళ్లు మండుతున్నది
అన్ని తీగల్లో తిమ్మిరి పుడుతున్నది
"తల్లివీణ జిందాబాద్
పిల్లతీగ ముర్దాబాద్."

"క్షమించాలి తల్లీ
మిగతా తీగల్లా మోగనందుకు
మన్నించాలి నన్ను
మౌనంగా చెలరేగినందుకు.

నువ్వు గొప్ప ; ఏం లాభం ?
నీ నెత్తిమీదున్నది పసిడి డిప్ప.
నీకూ నాకూ భేదమేమిటి
నేను పలికిన భిన్నశ్రుతి తప్ప.

అందుకే నన్ను నేను తెంచుకుంటున్నాను
ఆగామి సమాజంలో తలదాచుకుంటున్నాను.
మోగుతా అప్పుడు సరికొత్త తీగనై
సాగుతా తిరుగులేని వెలుగు వాగునై.

——

# ఏలినవారు

‘‘వస్తున్నారు వస్తున్నారు
ఏలిన వారొస్తున్నారు’’
అంతటా సంరంభాలు
అంగళ్లలో ఆడంబరాలు.

సౌధోపరి భాగాల్లో
స్వర్ణవర్ణ పతాకాలు
బీదా బిక్కీ గుండెల్లో
సీదా సాదా జండాలు.

‘‘వస్తున్నారు వస్తున్నారు
ఏలిన వారొస్తున్నారు.’’
విప్పారిన కళ్లతో ; ఎక్కుపెట్టిన కాళ్లతో
అరతెరిచిన నోళ్లు ; అలలెత్తే నొసళ్లు.

అలంకరించుకున్న అంగళ్లు దాటి
తలంటి పోసుకున్న ముంగిళ్లు దాటి
నులుపుకుంటున్న చేతులు దాటి
కలలు గంటున్న మూతులు దాటి
నడిచి వచ్చింది ఒక విగ్రహం
తరలి వచ్చింది సత్యాగ్రహం
కిరీటం పెట్టని తలతో
అరపంచె కట్టిన మొలతో ;

చిరునవ్వునే కరవాలంలా
చేపట్టిన మహాత్మబలంతో.

"ఇంతేనా ? ఇతడేనా ?
ఏలినవాడంటే మనలాగా
చాలీచాలని వాడేనా ?"
అంగళ్లకు మతిపోయి
ముంగిళ్లకు చెమట పోసి
ముఖాలు వాల్చుకున్నాయి.
ఒంటిపొరలు విడిచి
ఊహల అరలు మరిచి
ఒకటిగా కుదించుకున్నాయి.

---

# ఊరంతా హోరు

ఊరంతా హోరు
మొన్నటి వరదల్లో నా
కున్నదంతా పోయిందని.

మల్లె మొగ్గలాంటి యిల్లు
రేకుల్లాంటి గోడలు
ఎదిగిన ఎదల్లాంటి గదులు
ఒదిగిన ఊహల్లాంటి బీరువాలు
కాలాల గాలాలకు లొంగని
గ్రంథాల మీన బృందాలు
ఇన్నిటినీ మించిన సన్నజాజి మొక్క
ఈ మధ్యే పెంచుకున్న చిన్నారి కుక్క
మొన్నటి వరదల్లో మొత్తానికే
మునిగి పోయినట్టు
ఒకే పుకారు
ఊరంతా హోరు.

నిజం
వాన నిజం – వచ్చిన
వరద నిజం.
కలత నిజం – రెచ్చిన
కల్లోలం నిజం.

మొత్తం మునిగిపోయినా మిగిలినవి
మూర్తీభవించిన దీప్తులు రెండు.
అన్నీ ఆరిపోయినా రగిలినవి
అశ్రాంత శక్తులు రెండే రెండు.

నిర్మించే కలం
గర్జించే గళం.

—

# త్రేతాగ్నులు

ఒక అగ్ని - నా శిరస్సులో ;
పరస్పరం తిట్టుకునే
పాపపుణ్యాల మధ్య
చిత్రెత్తి కొట్టుకునే
చీకటి వెలుగుల మధ్య
ప్రభవించే భవితవ్యాన్ని
కబళించాలని పొంచిన
భూతానికీ రేపటి జల
పాతానికీ మధ్య
మతానికీ బహుజనాభి
మతానికీ మధ్య.

ఒక అగ్ని - నా వెన్నెముకలో ;
పంచేంద్రియాలకు సు
ప్రభాతగీతం పాడుతూ
నవనాడులకు తాం
డవనృత్యం నేర్పుతూ
రుధిరంలో జవనాశ్వం
కదను ముద్రించుతూ
శ్వాసలో ఝుంఝూనిలం
ఘోషను వల్లించుతూ

నిత్యం సరూపంగా నినదించే
మృత్యు జీవితాల మధ్య.

ఒక అగ్ని - నా కాళ్లలో ;
ఎల్లలను చెరిపేసి
కల్లలను తుడిచేసి
ముళ్లను చిగుళ్లుగా మార్చి
బీళ్లను పచ్చల మళ్లుగా తీర్చి
శిధిలాలలో కెంపులు మెరిసే
అధరాలను పండించి
మరణలీలలో బ్రతుకును కురిసే
మధుశాలను పొంగించి
అనుక్షణం ఉజ్జీవించే
ఆశకూ ఆశయానికీ మధ్య
నితాంతంగా ఉన్మేషించే
గతికీ గమ్యానికీ మధ్య.

# భరతవాక్యం

మొదటి చరుపు—
　　　　నగం తెరిచిన నోటిలో
　　　　పొగలు కక్కే మూలుగు.

రెండో దెబ్బ—
　　　　నడిమికి విరిగిన వెన్నెముకలో
　　　　నలిగిపోయే హాహాకారం.

మూడో వ్రేటు—
　　　　పేగులు తెగిన పొత్తి కడుపులో
　　　　పిచ్చెక్కే తిరుగుబాటు.

*

ఎదురు తిరిగింది కథ.
పొడి మూలుగులో పొలికేక
పడగెత్తిన కళ్లలో ప్రళయాగ్నిరేఖ
పదునెక్కిన పదిగోళ్ల మధ్య
బిగిసిన రెండు పిడికిళ్ల మధ్య
నెత్తురు కక్కిన పెత్తనం
అరిచి అరిచి చచ్చిన దొరతనం

— —

# నా పాట

నా పాట సాదాగా ఉండనీ
ఒళ్లు మండినా తిరగబడని
ఊదుబత్తిలా
గుండె కరిగినా తీండ్రించని
కొవ్వొత్తిలా.

నా పాట స్వాదువుగా ఉండనీ
విషం కలిసినా మధురించే
అమృతంలా
చేదు ముసిరినా హసియించే
జీవితంలా.

నా పాట పిచ్చిగా మండనీ
వ్యక్తి ఆరినా జ్వలించే
వ్యవస్థ ఆశలా
వ్యవస్థను విప్లవీకరించే
వ్యక్తి శ్వాసలా.

——

# దేశపటం

ఇది నేను
ఈ రోజు గీసిన
దేశపటం.

సముద్రాలు కాళ్లు
చెట్లు చేతులు.
నదులు నాడులు
కొండలు కండలు.
విరులు ఆశలు
ఆవిరులు శ్వాసలు.

అన్నీ ఉన్నాయి
బాగా ఆడుతున్నాయి.
ఏదీ మరి గుండెకాయ ?
ఆగండి.
ఆస్పత్రిలో ఉంది.

---

# ఎంత? ఎంతెంత?

నా వయసు
వేదమంత.
నా మనసు
వెన్నెలంత.

నా ఆశ
ఆకాశమంత.
నా అవధి
అంభోధి అంత.

నా నవ్వు
పచ్చి నురగంత.
నా నడక
పిచ్చి పరుగంత.

ఇంతకూ నేనెంత ?
ఎంత ? ఎంతెంత ?
మావులో విరిసే రేపంత.
రేపులో వెలిగే చూపంత.

# ఉష్ - నిశ్శబ్దం!

ఉష్——
నిశ్శబ్దం:
ఎవరూ మాట్లాడొద్దు
నిశ్శబ్దం; పరమ నిశ్శబ్దం.

సూర్యుడు నిశ్శబ్దం
చంద్రుడు నిశ్శబ్దం
చుక్కలు నిశ్శబ్దం; అష్ట
దిక్కులు నిశ్శబ్దం.

మోహం నిశ్శబ్దం
స్నేహం నిశ్శబ్దం
మృత్యువు నిశ్శబ్దం; నిసర్గ
సత్యం నిశ్శబ్దం.

*

అన్నీ నిశ్శబ్దంగా ఉన్నాయి
సంప్రదాయబద్ధంగా ఉన్నాయి
అయినా విను విను
అటు అటు 'శ్రుణుశ్రుణు'.
నిశ్శబ్దాన్ని రెండుగా చీల్చి
గతాన్ని వర్తమానంలో వేల్చి
అతిగమిస్తున్న దొక శబ్దం
అభినవసృష్టికి ప్రళయాబ్దం.

——

# క్షణ క్షణ నిరీక్షణ

ఎడారి ఎదురు చూస్తుంది
గరికపరక కోసం
పుడమి ఎదురుచూస్తుంది
వానచినుకు కోసం.

తోట ఎదురుచూస్తుంది
వసంతం తాకిడికోసం
బాట ఎదురుచూస్తుంది
పథికుల తొక్కిడికోసం.

తీగ ఎదురుచూస్తుంది
గాలి లాలన కోసం
మొగ్గ ఎదురుచూస్తుంది
భ్రమరపాలన కోసం.

ఆకలి ఎదురుచూస్తుంది
గుప్పెడు మెతుకులకోసం
చీకటి ఎదురుచూస్తుంది
గుంపెడు వెలుగుల కోసం.

రక్తం ఎదురుచూస్తుంది
రగిలే ధైర్యం కోసం

రాజ్యం ఎదురుచూస్తుంది
మిగిలే ధర్మం కోసం.

*

ఎడారిలా మండుతూ
పుడమిలా ఎండుతూ
తోటలా తొంగిచూస్తూ
బాటలా పలవరిస్తూ
తీగలా పరవశిస్తూ
మొగ్గలా పులకరిస్తూ
ఆకలిలా అలమటిస్తూ
చీకటిలా అటమటిస్తూ
రక్తంలా ఉజ్వలిస్తూ
రాజ్యంలా ఉత్క్రమిస్తూ
మరోశక్తి నిరీక్షిస్తున్నది
తిరుగులేని ప్రగతికోసం
పిడికిళ్లలో పొడుచుకొచ్చే
పిడుగుల సంతతికోసం.

---

# నీ చూపులు

అవిగో నీ చూపులు
అగ్నిలో ఈదే ఆవిరులు.
పంచేంద్రియాలను ఒకే సంపుటిలో
ప్రపంచించే ఊపిరులు.

ప్రభాతం పురిటిగదిలో
ప్రభవించే కిరణకిశోరాలు.
అస్తమయం పడకగదిలో
అలలెత్తే ఉదయతీరాలు.

అరెరే నీ చూపులు
ఆరని జ్వాలా పక్షాలు.
విధిలేక కటకటాల్లో
ఒదిగిన హర్యక్షాలు.

—

# అమృతాక్షరి

ఎందాకా ఈ నిరీక్ష
కాసేపు విరమించు.
అలిసిపోలేదా కళ్లు
క్షణకాలం విశ్రమించు.

చీకటి కురుస్తున్నది
కాటుక కన్నీరుగా.
దీపం కునుకుతున్నది
ఆశకు ఆనవాలుగా.

మండుతున్నది అర్ధరాత్రి
మహిషాసుర మర్దనిలా.
వేచి ఉన్నది అగ్నిగాత్రి
విప్లవాభి వర్ధనిలా.

నిండుతున్నవి నెలలు
పండువెన్నెల రేకల్లా.
పండనున్నవి కలలు
పచ్చజొన్న కంకుల్లా.

ఉదయించే ఆ పాప
ఉజ్వలభావ విభాస్వరి.
జననాన్నీ మరణాన్నీ
జయించే అమృతాక్షరి.

——

# అయిదే అయిదు

చూపు పారేసుకున్నాను
నాల్క తెగ్గోసుకున్నాను.
ముక్కు చెక్కేసుకున్నాను
చెవిని రాతిపలకగా చేసుకున్నాను
చేతివేళ్లకు తిమ్మిరి పూసుకున్నాను.

బాగుంది
రోగం కుదిరింది.
వంచించే పంచేంద్రియాలకు స్వస్తి
వికారాల వెర్రిమేళం ఇకపై నాస్తి.
అయితే ఈ నేను
ఋషిని కాదు మనిషిని.
నీటిలో కాదు
నిప్పులో పుట్టిన శేముషిని.

నా గుండె పెరట్లో
మెదటి కుదుట్లో
నాటుకున్న సత్యాలు అయిదు
నవచేతన వాటి పాదు.

రాత్రి కడుపులో పడగెత్తే
రక్తాంశువు —

కమ్మని బతుకును పుక్కిలించే
కటిక చేదు —

నరాల తలలూపించే
గుగ్గిలం పొగ —

ఇరుకు సందుల్లో ఘూర్ణిల్లే
రొద —

ఎటు తాకినా చుర్రుమనే
వ్యథ —

---

# క్షణాలు రెండు

ఈ క్షణం
విస్మృతి
మృతి
మసక చీకటిలా
మంచు గడ్డలా.

మరు క్షణం
జాగృతి
ప్రగతి
ప్రత్యూషంలా
ప్రాణానిలంలా.

అది గతం ;
బూదిలా విశ్రమించేది.
ఇది ప్రస్తుతం ;
సూదిలా పొడుచుకొచ్చేది.

———

# ప్రకృతి : ప్రగతి

ఇసుక రేణువు—
మంచు బిందువు—
ఒకటి తడిసేది
ఒకటి తడిపించేది.
ఒకటి మెరిసేది
ఒకటి మెరిపించేది.

ఇసుకకు మెరుపొస్తుంది
మంచు కురిస్తే.
పెదవికి తళుకొస్తుంది
నవ్వు విరిస్తే.

మంచులో తడిసిన ఇసుకే
మండుతుంది నిప్పులా—
నవ్వుతో విరిసిన పెదవే
పొంగుతుంది ఉప్పెనలా—
ఒకటి వేసవిలో
ఒకటి విసుగులో.

*

అది పరిణమించే ప్రకృతి
ఇది ప్రతిఘటించే ప్రగతి.

——

# దీప్త చైతన్యం

విను విను విను
మనసా : విను.
చిగురాకుల సవ్వడులను
సెలయేరుల అలజడులను
పాత యిరుల మాటలను
లేత విరుల పాటలను ;
విను విను విను
మనసా : విను.

ఆరు ఋతువుల భజనలను
సారాలో తడిసిన 'గజళ్ల'ను
పగలు మలిగి ; రేయి వెలిగి
ప్రతిధ్వనించే పొదరిళ్లను.
విను విను విను
మనసా : విను.

పలకరించే సుగంధాన్ని
పరిమళించే ప్రబంధాన్ని
లక్షల అప్రశుతుల తోవిడిలో
లయ తప్పని ఆనందాన్ని
విను విను విను
మనసా : విను.

ఇన్నీ విన్న చెవులతో
ఇదీ విను మనసా !

వంద గొంతులు చలిస్తే
వేయిగుండెలు పిలిస్తే
లక్షచేతులు కలిస్తే
కోటి అడుగులు ధ్వనిస్తే
ఉదయిస్తుంది ఒక గుప్తసైన్యం
అదే అదే దీప్త చైతన్యం.

—

# తుదిలేని ఆది

ఇది కావాలి తుది
కరిచే ఆకలికి.
ఉరికే రక్తం నడుమును
విరిచే ఆవిరికి.

ఇది కావాలి ఆది
గెలిచే సామ్యానికి.
నియంతలకు ఎదురొడ్డి
నిలిచే ప్రజాస్వామ్యానికి.

ఇది కావాలి తుదిలేని ఆది
సమతకు నమస్కరించిన మమతకు
ప్రజను మనసావహించిన ప్రభుతకు.
నిర్దుష్ట ధ్యేయానికి
నివురు గప్పని న్యాయానికి.

---

# క్రాంతి హాసం

పగలు ముదిమితో మూల్గినప్పుడు
పక్షులు నోళ్లగూళ్లు మూసినప్పుడు
గాలి కాళ్లు చల్లారినప్పుడు
నేల ఒళ్లు నిట్టూర్చినప్పుడు

కనురెప్పల మీద ముదురు చీకటి
కలల చిగుళ్లు మేస్తున్నప్పుడు
రేపనే రెమ్మకొసలో ఇరుక్కొని
రేయి కోయిల కూస్తున్నప్పుడు

ప్రణవంలాంటి తాదాత్మ్యంలో
ప్రాణానిలం నిశ్చలిస్తున్నప్పుడు
పదంలాంటి కైవల్యంలో
ప్రపంచం పరమపదిస్తున్నప్పుడు

అప్పుడు నా ఆమ్రేడితం
అస్తమించని ప్రత్యూషం.
అప్పుడు నా అనుప్రాసం
అవధిలేని క్రాంతిహాసం.

—

# ఇప్పుడు నేను

మంచు మంటలూ
మౌన ఘంటలూ లేని
విముక్తుణ్ని.

ఇప్పుడు మిట్టమధ్యాహ్నం
ఎండలో శీతలిస్తున్న
సశక్తుణ్ని.

అంతా శూన్యం ; ఎడారిలా
ఆవులించే దైన్యం.
నెత్తిపై పడనున్న కత్తిని
నిలదీసే కారుణ్యం.

చీకట్లో సాగే ఈ నడక
వేకువ కాళ్లకు రూపాంతరం.
పానకంలో పొడమే పుడక
పర్యాయ రుచికి నామాంతరం.

---

# ఒ కే ప క్షి

ఒకే పక్షి
నిఖిల రోదసి నిండా
వికసించిన ద్వ్యక్షి
ఒకే పక్షి.

ఎండను మేస్తుంది
వెన్నెలను తాగుతుంది.
గాలిని కప్పుకుంటుంది
గగనంలో పడుకుంటుంది.

పయనముంది
లేదు విరతి.
లయ ఉంది
లేదు యతి.

ఒక రెక్క కదిలిస్తే
ఉషస్సు.
తతిమ్మా రెక్క విదిలిస్తే
తమస్సు.

ఏడుస్తుంది శ్రావణంలా
నవ్వుతుంది శరన్మేఘంలా
కరుస్తుంది మాఘంలా
విరుస్తుంది మధురాగంలా.

ఆ పక్షి గరుత్తులు
అవనీ వియత్తులు
అది ఉద్వేలం
అది కాలం.

——

# ఘర్షణలో

చచ్చింది ప్రేమ
ఉరిపోసుకుంటున్న
ఉద్రిక్త బాహువుల మధ్య.

రెచ్చింది బ్రతుకు
ఉడుకెత్తిపోతున్న
ఉభయ సంధ్యల మధ్య.

ఒరిగింది కాలం
రేపు తనను లేపుతుందనే
ఊపిరిని విశ్వసించి.

వెలిగింది విశ్వం
కళ్లలో విచ్చుకుంటున్న
గవాక్షాల నుంచి.

ప్రేమ పొంగితేనే బ్రతుకు
బ్రతుకు పండితేనే కాలం
కాలం పరుచుకుంటేనే విశ్వం
విశ్వం గుండె ఘర్షిస్తేనే
భాస్వత్ భవిష్యత్ దృశ్యం.

—

# ప్రశ్నిస్తున్నాను

ఎందుకో అసూయ నీపై
ఎండిపోయిన చెట్లకు ?
అనుక్షణం ఆకుపచ్చదనం
ప్రతినిత్యం ప్రగతిగుణం
వద్దంటున్నా నిన్నే
వరిస్తూ వుంటే——
ఎందుకో అసూయ నీపై
ఎండిపోయిన చెట్లకు ?

చిగుళ్లే తప్ప
వగుళ్లు లేవు నీలో.
పదునే తప్ప
ముదిమి లేదు నీలో.
ముడుచుకోవడం
నీవల్ల కాదు
అడుగేయడం తప్ప.
చిరుచిరు చిందులు
నీచేత కావు
శివతాండవం తప్ప.

ఎడాపెడా జడివాన
కొడుతూ వున్నా

సూదిలా దూది వెన్నెల
పొడుస్తూ వున్నా
మా చేసిన చలినాగు
కాటేస్తున్నా
పచ్చదనాన్ని పీల్చేగాలి
కచ్చె కడుతూనే వున్నా
పసివాడిలా
అసి వాడిలా
పల్లవిస్తూ ఉంటావు
పరాక్రమిస్తూ ఉంటావు.

ఇంతకు మించి నీవు
ఏ నేరం చేయకున్నా
ఎందుకో అసూయ నీపై
ఎండిపోయిన చెట్లకు ?

---

# "రాజా నా రాజా"

'రాజా నా రాజా' !
'ఆ ఆ ఆ ఆ ...'
రేడియో తెగయేడుస్తున్నది
ప్రతిమించిన కథానాయిక
శోకాన్ని పంచుకుని.
'రాజా నా రాజా!'
'ఆ ఆ ఆ ఆ....'
రాగం తెగయీడుస్తున్నది
ఊళ పెడుతున్న గాయిక
ఊపిరిని పరీక్షించుకుని.

*

'రాజా నా రాజా' !
'భౌ భౌ భౌ భౌ !'
పల్లవి అదే
ప్రాణస్పందన వేరు.

'రాజా నా రాజా' !
'భౌ భౌ భౌ భౌ... !'
నాదమదే
ప్రతి నాదం వేరు.

ఏ కడుపులో మొలిచిందో
ఏ గుడిసెలో పలికిందో
ఏ నెత్తురును పంచుకుందో
ఏ నిజాయితిని రంగరించుకుందో
పెరుగుతున్నది నా యింటిలో
స్థిరపడింది నా ముంగిటిలో.

ధ్వనిని చూస్తుంది
రూపాన్ని వింటుంది.
ఉల్కలా మేల్కొంటుంది
ఉగ్రాక్షిలా ఉద్గమిస్తుంది.
కమికెడు బువ్వతిని
కర్తవ్యాన్ని సానపడుతుంది.
చిప్పెడు పాలుతాగి
చీకటిని జల్లెడపడుతుంది.

పేరులో అది 'రాజా'
తీరులో అది ప్రజ.

——

# ఈ రాత్రి

ఈ రాత్రి
ఏమీ చూడలేను.
దివాలా దిక్కులు
దివానా దృక్కులు.
వినువీధిలో ఉరేసుకుని
వేలాడే చుక్కలు.

ఈ రాత్రి
ఏమీ వ్రాయలేను.
బుర్రలో రొద
వెర్రెత్తే వ్యథ.
చిచ్చులాంటి చెమటలో
శివమెత్తే క్షుధ.

*

ఆగండి
ఈ రాత్రి ఇదే రాత్రి
చూస్తాను వ్రాస్తాను.
కటకటాలు చీల్చుకుని
పొటమరించే రవిబింబాన్ని.
నిట్టూర్పులు నెట్టుకుని
నినదించే నవగీతాన్ని.

---

# అసలు దీపం

నీవు కూచున్నావు
నాలాగా కిందకాదు
ఎత్తు గద్దె మీద ;
ఎందరో ఉండే గుడిసెలో కాదు
గచ్చు మిద్దె మీద.

నేను వెలుగుతున్నాను
నీలాగా నింగిలో కాదు
నేలపైన.
సూర్య చంద్రుల్లా కాదు
చుద్రుమనే స్ఫులింగ బింబంలా.

అసలు నేను
కొసరు నువ్వు.
మూలకాంతి నేను
తైలభ్రాంతి నీవు.

అందుకే అసలు దీపం
అలా వెలుగుతూనే ఉంటుంది.
అమృతం లాంటి నిజం
అనంతంగా పలుకుతూనే ఉంటుంది.
తిమిరాలు హరించినా
తిక్క బుద్ధులు ధిక్కరించినా.

— —

# ఇది మథనం
# అది ఉదయం

ఇది మథనం
హృదిలో పుట్టే గీతానికి.
గీతం లోపలి లోతులకు
ఏతామెత్తే సంగీతానికి.

అది ఉదయం
నదించే జలపాతానికి.
జలపాతం గుండెల కదలికలో
మొలిచే విద్యున్నవనీతానికి

ఇది మథనం
ముదిసిన కారు చీకటికి.
చీకటి అడుసులో సనసన్నగా
రేకులు విప్పే వేకువకి.

అది ఉదయం
ఎదిగి వాలిన నిన్నటికి.
నిన్నటి నుదుట రేపటి తిలకం
హత్తించే క్రొన్నెత్తుటికి.

---

# ఇంకో గీతం

ఇంకో గీతం
ఇంకిపోని ఎర్రసిరాతో
జీవితాల కాగితాల మీద
చిరిగిపోయే ఆశయాల మీద.

ఇంతవరకు గీసిన పదచిత్రాలు
ధ్వనుల ధునుల మూసలలో
పోసిన సంగీత శతపత్రాలు.
ఆ కతవేరు
అరిచే గాయాల నోళ్లు కుట్టేసే
ఈ స్థితి వేరు.
ఆవులిస్తే అపరసంధ్య
కన్ను తిప్పితే కటిక చీకటి
చేయి కదిపితే వేయి సంకెళ్లు
వీపు మోపితే విషపు చూపుల ముళ్లు.

ఈ తెలుపు
వెన్నెలదీ కాదు
వేగు చుక్కదీ కాదు.
ఈ ఎరుపు
అరుణుడిదీ కాదు

సహస్ర కిరణుడిదీ కాదు.
పగటిని దగా చేసే నిశ
పొగరుకు పొగవేసే నిషా.
సత్యాన్ని చల్లగా హత్య చేసి
సరదాగా బతుకుతున్న మృష.

ఇంకో గీతమిది
కారడవి లాంటి అంధకారాన్ని
క్రకచంలా చీల్చే వజ్రసంగీతమిది.
గిరిలాంటి స్తబ్ధతనుంచి ఎ
గిరిదూకే అగ్ని జలపాతమిది.

——

# అందుకే వెళుతున్నా

'ఒరే ఒరే ఆగు.'
'ఆగను.'
'ఎక్కడికిరా నువ్వెళ్లేది ?'
'ముందుకు'.
'ముందుకెళితే నిప్పురా.'
'నిప్పే నా నేస్తం '
'నిప్పంటే మృత్యువురా.'
'కాదు సత్యంరా.'
'రా ! ...'
'ఔనురా.'

*

''నేనూ 'రా' కొట్టినందుకు క్షమించు.
అది నీవు నేర్పిన విద్యే అని గమనించు.
అసలు విషయాని కొస్తాను
అక్షరాలా ఆలకించు.

గతం మృతం
భవిష్యత్తు అమృతం.
రేపటి ధ్యాస
ఈ తరం పీల్చే శ్వాస

అందుకే నేను వెళుతున్నాను
ముందుకు మరీ ముందుకు.
రాత్రి కౌగిట్లో చల్లబడిన సూర్యుణ్ని
రగులొక్కలిపేటందుకు.

---

# ఓ జనస్సు నా ధనుస్సు

మంచు ముద్దల్లో
మార్తాండ బింబాలు ఉదయిస్తే
గులాబీ తీగల్లో
ప్రళయానల జ్వాలలు ప్రసవిస్తే
పిల్లగాలిలో
కల్లోల ఝంఝలు ప్రసరిస్తే
పిల్లన గ్రోవిలో
విప్లవ శంఖాలు వినిపిస్తే
అది వికృతి కాదు
అసలైన ప్రకృతి.
అపశ్రుతి కాదు
ఆగామి యుగశ్రుతి.

చచ్చేటంతటి చీకటి — నోరు
విచ్చేటంతటి ఆకలి
నడిచేటంతటి శూన్యం — కళ్ల
తడిపేటంతటి దైన్యం
అల్లుకున్న జీవితాలకు ;
ఆశానిరాశల అడక తెరల మధ్య
అవురంటున్న భవితవ్యాలకు
ఆఖరి ఉపిరి ఆవేశం.

ఆవేశం పుడుతుంది
అలలెత్తే సరిత్తులో.
ఆవేశం పుడుతుంది
ఆక్రమించే విద్యుత్తులో.
ఆవేశం పుడుతుందయ్యా
జీవితాలను పిండిపోసినా
చిల్లిగవ్వకు కొరగాని
చితికిన బతుకుల నుంచి ;
గుండెలు మాడిపోతూ వున్న
గుడిసెల కప్పుల నుంచి.

ఆవేశం కళ్లలో ఉరికితే
అరుణారుణ కిరణాలు
అదే గొంతులో పలికితే
అభ్యుదయ గేయచరణాలు.
పిడికిళ్లలోని ఆవేశం
పిడుగులను పుట్టిస్తుంది.
నడినెత్తిలోని ఆవేశం
నవయుగాన్ని సృష్టిస్తుంది

ఆవేశం ఉత్సాహమైతే
ఉత్సాహం ఉత్తేజమైతే
దాని పేరే ఓజస్సు ;
అదే నేను ఎక్కుపెట్టిన ధనుస్సు.

ఈ ధనుస్సు ఛేదిస్తుంది కోపాలను
ఇది భేదిస్తుంది పాపాలను
ఇది అవరోధిస్తుంది ఉన్మాదంలో
ఎగిరిపడే తమోరూపాలను.

*

అకుంఠిత సంకల్పానికి
        అపరాకృతి ఓజస్సు.
అక్షత లక్ష్యానికి
        అక్షరస్థితి ధనుస్సు.